శ్రీ

# త్రైశంకువిజయము

అను

గానప్రబంధము.




అనకాపల్లి వాసుండగు

## బీ. బాలాజీదాసునిచే

వ్రాయబడినది

---

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు

బీ. కే. స్వామిచే

ముద్రింపబడియె.

రెండవకూర్పు 500 ప్రతులు.

*Revised.*

**1915.**



**Price Re. 0-6-0]** [వెల రు. 0-6-0.

శ్రీ

# త్రైశంకువిజయము




అను

గానప్రబంధము.

అనకాపల్లి వాస్తుండగు

బీ. బాలాజీదాసునిచే

వ్రాయబడినది

---

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు

బి. కే. స్వామిచే

ముద్రింపబడియె.

రెండవకూర్పు 500 ప్రతులు.

*Revised.*

**1915.**

---



**Price Re. 0-6-0.**] [వెల రు 0-6-0.

చదువరులారా!

ఇందు నెరసులున్న చక్కజేసికొని యుపయోగింపుడు.

విధేయుడు.

అనకాపల్లి బీ. బాలాజీదాసుడు.

## ప్రకటన.

ఇందు గల పుస్తకములు వలయువారు విశాఖపట్టణ జిల్లా అనకాపల్లి వాసుండగు బీ. బాలాజీదాసునకు వ్రాసిన వచ్చును.

| | | |
|---|---|---|
| 1 | రుక్మాంగద లేక యేకాదశీమాహాత్మ్యము | 0-8-0 |
| 2 | ప్రియంవదాచరిత్ర | 0-6-0 |
| 3 | జయప్రదాదేవిచరిత్ర (అనగా పురూరవ) | 0-6-0 |
| 4 | సీతాకల్యాణము | 0-6-0 |
| 5 | గయోపాఖ్యానము | 0-6-0 |
| 6 | త్రైశంకు విజయము (అనగా హరిశ్చంద్ర) | 0-6-0 |
| 7 | నలచరిత్ర | 0-6-0 |
| 8 | దయాకరవిజయము | 0-6-0 |
| 9 | ద్రౌపదీ మానరక్షణము | 0-4-0 |
| 10 | సూరదాసు చరిత్రము | 0-4-0 |
| 11 | పురందరదాసు చరిత్రము | 0-4-0 |
| 12 | కర్ణానందదాయిని (పద్యములు) | 0-4-0 |
| 13 | హరికథేతిహాసమంజరి మొదటిభాగము పద్యములు | 0-4-0 |
| 14 | డిటో రెండవభాగము కీర్తనలు | 0-4-0 |
| 15 | బాలసుందర- మద్దిరంగనాయక విరచితము | 0-4-0 |
| 16 | సారంగధర డిటో. | 0-4-0 |
| 17 | సారంగధర సూ॥ సూర్యనారాయణ విరచితము | 0-6-0 |
| 18 | కుచేలోపాఖ్యానము సుదర్శనదాస విరచితము | 0-8-0 |
| 19 | కర్ణ చరిత్రము డిటో | 0-8-0 |



శ్రీ

# త్రైశంకువిజయము.

శా. శ్రీరాజాంక! నగాత్మజాకుచతటీ శ్రీగంధలిప్తాంగ! సం
సారాంభోనిధి మగ్నమర్త్య తరణా! సద్భక్తకల్పద్రుమా
పారావారనిషంగ మానిగణ హృత్పద్మార్క బింబోదయా
కారుణ్యాస్పద మత్కృతింగొని ననుం గాపాడు మృత్యుంజయా.

## గురుస్తుతి.



క. తగ నాంధ్రభాష గఱపిన
తగవరి పాటూరుకుల సుధాబ్ధి విధుం
డగు వెంకటసామి మదీ
య గురుని మదిలోఁ దలంతు ననవరతంబున్.

## కవివంశావళి.

సీ. భరతఖండంబున భాసిల్లు వైశాఖ పట్టణాభ్యంతర వాసకుండ। గుఱు భరద్వాజస గోత్రపావన ప్రభుడు లక్ష్మణదాస పౌత్రకుండ। రహిమీర కేశవ రామాఖ్యునకు గన్నమాంబకు నేద్వితీయాత్మజుండ। విశ్రుత గానప్రవీణుఁడౌ బాలాప్రసాదు గారికి నే సహోదరుండ

గీ. శైలజాహృదయాబ్జ భాస్కర కటాక్ష
వీక్షణప్రాప్త గాన కవిత్వయుతుడ
శ్రీరమాప కథాబోధనారతుండ
అరయ బాలాజిదాస నామాంకితుండ.

మిత్రులారా !

వ. జీవకోటిలో నరజన్మ ముత్తమమని మీ కెఱింగినదె యిట్టిజన్మ మెత్తినందుకు ఆనంద స్వరూపుండగు భగవంతుని దయనొందుటకై తగు ప్రయత్నించుట ఆవశ్యకము. మఱియు, సుజనులయెడ వినయము బీదలయెడ గనికరము దేవునియందు ప్రపత్తి మాటల యందు నిజము నెరపిన నరుండు సద్గతినొందగలడు చూడుడు. మున్ను సత్యవ్రతంబూని యశమొందిన హరిశ్చంద్రచక్రవర్తి చరిత్ర మీ క్రింద పొందుపర్చెద సావధానచిత్తులరై విని చెరకుల నావలంద్రోసి యానందించి మన్నింపవేడుచుంటి.

వ. సకలసంపదల కునికిపట్టగు అయోధ్యాపురం బొకటికలదు. దానిని హరిశ్చంద్రుం డేలుచు చంద్రమతియను సాధ్వీమణిని బరిణయమై, పుత్రకునిగని లోహితాస్యుం డను నామంబిడి దినములు గడపుచుండ, స్వర్గపట్టణమున సింహాసనాధ్యక్షుండై యున్న దేవేంద్రుండు.

సావేరి—చతురశ్రగతి.

మునులార ? కనుడి మోదంబున వినుడి॥ ము॥
అనవరతము బాలాజీదాసు లాచరింపదగిన తేటమాట॥ ము॥
భూలోకంబున మీ కెఱుగని నరపాలు రెవరు లేరు, వేమారు॥ ము॥
చనువున నడిగితి మానవలోకంబున భూతవర్తమాన కాల
మనుజనాయకులలో నన్పృతంబాడని వారలున్న దెల్పుడువినగోరితి॥ము

వ. యిట్లు యింద్రుండడుగ తాపసు లొకరిమొగం బొకరు చూచుచున్న తఱి తపోధనుండును మునికులశ్రేష్ఠుండును భూతభవిష్యద్వర్తమానవేదియగు వసిష్ఠుండు సంక్రందను నాలోకించి.

తే. ఆకర్ణింపుము పర్వతభేదీ ! ఆర్యానుకూలవ
ర్తి కెక్కెను నరలోకములోన హరిశ్చంద్ర చక్రవర్తి
శివునిపద సరోజంబుల సాక్షిగ జెప్పెద త్రైశంకుండు
లవమాత్రము దప్పనాడ డెప్పుడు రవికుల ప్రభూతుండు.

వ. ఇట్లరుంధతీరమణుండువలుక. గాధినందనుండువిని కన్నులెఱ్ఱజేసి పదఘట్టనం బొనర్చుచు.

సీ. తమ శరీరమువంచి తగుబాటుపడలేక విద్యకు నామంబు వెట్టిపెట్టి
ఘనపాండితీశక్తి గనలేక విబుధుల పోషమ్మొనరుచు నింట బొంచి

పొంచి । సాని పాపలతోడ సరసంబులాడుటకై తమ మాన్యమ్ము
లమ్మి యమ్మి । సారాయిబ్రాంది సీసాలకొలది ద్రావి మితిలేని
మాంసము మెక్కి మెక్కి

గీ. సుకృత కార్యమ్ములకు సున్న జుట్టి చుట్టి
చెడుగు పనులకు ముందుగ నడిచి నడిచి
కండక్రొవ్వున కాలమ్ము గడుపుచుండు
నేలమగ లేడ సత్యమ్ము నెఱపుటేడ.

వ. ఇట్లనగా వసిష్ఠుండు నవ్వి గాధేయు నాలోకించి.

బేహాగ్ — ఆదితాళము.

విను గాధినందన
నను గెల్వలేవు నీమాటలిచట పనికిరావు నే నెరుంగుదు నీలావు॥ వి॥
పిచ్చుక గరుడునితో సరియన నచ్చున దబ్బరలాడు రాచ
ముచ్చుల త్రిశంకునితో సమమన వచ్చున బాలాజి మెచ్చున॥ వి॥

వ. మఱియు వాని వర్తనమును వినుము.

సీ. కొక్కొరోకోయని కోడికూసినయంత స్నానంబుగావించి సంధ్య
వార్చి । అవనీసురుల పాదమర్చించి పిమ్మట నైదురీతుల తిండినార
గించి । విడియంబుగొని కొంతవడి నిద్రగావించి తరువాత లేచి
యాస్థానమునకు । జని రాజ్యకార్యముల్ చక్కగ సవరించి సత్పండి
తాళిని సత్కరించి ।

గీ. కాలమునుద్రోయుచుండు నా ఘనయశుండు
పద్మపత్రహితాన్వయ పావనుండు
అఖిలవిద్యాధికుండు సత్యవ్రతుండు
శాంతమూర్తి హరిశ్చంద్రచక్రవర్తి.

వ. ఇట్టి సుగుణవంతుడగు హరిశ్చంద్రుండు కల్లలాడు టెక్కడ నామాట విని యట్టి పట్టుదలవిడిచి నీగౌరవము దక్కించుకొనుట మంచిదియన విశ్వామిత్రుం డరుణ లోచనుండై పండ్లు పటపట నొఱుకుచు.

ఉ. హా యిది యేమిచిత్రము నరాధిపులెప్పుడు దప్పుకూతలం
గూయరె? నోరుమూయుము గనుంగొను మత్తులువిప్పి నేను గా

ధేయుడ భానునందన రతిప్రియపద్మజ నీలకంఠ నా
రాయణులైన నాకెదురు రాగలరే మదినేన యల్గినన్.

కమాచి—ఆదితాళము.

మానరా మునికులసిక్రృష్టా యో మంకువసిష్ఠా॥ మాన॥
మానవాధముండగు త్రైశంకుడు మాటదప్పనాడడనుచు నీవనుట॥
అలవింధ్యాచల గర్వంబణచిన కలశోద్భవుడుండ బ్రాహ్మిను
కుల నేర్పరచిన శ్రీపరాశరుని కూర్మికొమరుడుండ బలారిని
నలుకబూని శపియించిన యహల్యావల్లభుడుండ బురారిని
చులుకనగనెంచి యరకాలికన్ను జూపిన భృగుడుండ దపస్సున
నలువను దిరస్కరించిన గాధితనయుడను నేనుండ బాలాజిని
సలలితముగ నేలిన శివపాదంబుల నిరతము స్మరియించెడి యీవే
ల్పుల దొరదండ సకలదివిజులుండ బలుగొప్పవాడ నీవనికొనియిటు
బలుకు చుంటివిచ్చోట నీమాట పనికిరాదు పనికిరాదు పనికిరాదు॥

వ. ఇట్లు గాధేయుండన వసిష్ఠుడు నవ్వి.

సీ. పడమటికొండపై భానుండువొడమిన దమ్మిపుట్టువు వ్రాత తప్పిపో
నిన। కులధారుణీధరంబులు మేరమీరిన స్వాహావధూజాని చల్ల
నైన। హేమాచలంబది భూమిలోగృంగిన దలక్రిందుగా జగత్త్రయ
ము వడిన। నుడలపై గ్రహముల సంచార ముడిగిన బ్రాయేలు
లేదు నిర్జలములైన।

గీ. మిన్నువిరిగిన దారలు మింటనుండి
నేలరాలిన నల్లభూపాలు డెపుడు
తప్పనాడడు నీబెట్టదమ్ముపగిచి
ఇంతతో గౌరవమ్ము దక్కించుకొనుము.

వ. ఇట్లరుంధతీరమణుండు వలుక గాధినందనుండు గంతుపడుచు నేనాడుశ్శీల్కు
చే దబ్బరలాడించెద మఱియు జాగ్రతగనుండుమని బోధింపవచ్చునుగాని పందెమేమిరో
యీనుచానీయని ముందు వెల్లడింపుమన వసిష్ఠుండు నవ్వి.

తో. ప్రత్యేకము సెప్పనేల భూపతి ప్రభవంబాటకు మొదట
సతంవతుడపు గమాసి వాణీజాని వాసె నెన్నుదుట.

వ. నిజముగ వాతనిచే బొంకించితివేని.

కళ్యాణి—ఆదితాళము.

వినుమా గాధిపుత్రా! యిటు గనుమా యోవిశ్వామిత్ర॥ విను॥
మునిపుంగవ త్రిదశాలయవాసుల ముందుగబల్కెద నాప్రతిన॥
మీాసము మసృకుమా బాలాజీ దాసావనుసాక్షిగ బల్కెద॥ విను॥
ఘన జపములు వర్జించి విప్రకర్మలను విసర్జించి
పెను జందెమ్మునుద్రెంచి కడుప్రియమున దలగొరిగించి దను
వున బూడిదనలదించి కరమున గపాలముధరించి
దనరగ గాడిదమీాద నెక్కి దక్షిణదిక్తటమున విహరింతు॥ విను॥

వ. బొంకింపలేకున్న నీప్రతిన వెల్లడింపుమన గౌశికుండు.

సీ. ఏలయీావాదమ్ము లీయోలగములోన విను మిప్పు డేను గావించు
ప్రతిన । భూపతిచేత నే బొంకింపలేకున్న దుంపలదిని పొట్ట నింపికొ
నుచు । చలికొండపైనెక్కి చర్మాంబరునిగూర్చి తపమాచరించిన
తత్ఫలమున । సగమిచ్చి పెక్కేండ్లు చక్రవర్తిగనుంచి యటుమీా
ద వాసవాస్థానసమున.

గీ. వ్యాస గౌతమ శాండిల్య వాలఖిల్య
కపిల కౌండిన్య భర్గ మృకండు కల్య
నారదాత్రి మౌద్గల్య వినాద వల్య
కలశసంభవు లెఱుగంగ నిలుపువాడ.

వ. ఇవ్విధమున నమ్మునిగ్రామణు లన్యోన్యప్రతినలు వలుక.

కం. కుమ్మరిసారె తెఱంగున
నిమ్మహి గిఱ్ఱుమని దిరిగె హేమోన్నదెం
దమ్మడరెన్ సప్తసము
ద్రము లల గంగ బారె దారుణరాలెన్.

వ. ఇట్లయిన సంక్రందనుండు ప్రకంపితశరీరుండై పేరోలగంబు జాలించె. సమరులు మిగుల భయమంది నలుదిక్కులకుం బరువిడ సాగిరి మునిజనంబు లన్యోన్య ముఖావలోకనంబొనర్చి జడలువీడ గౌశేయాంబరములూడ కర్ణకుండలములు వ్రేలాడ నిజనివాసంబుల

ఘం జనిరి వశిష్ఠకౌశికుల కోపంబు లంతరంగంబుల గాపురంబు సేయ దమ తమ నెలవులం జేరిరి హరిశ్చంద్రుం డొకనాడు సూర్యునిపై జూడ్కినిల్పి యర్ఘ్యమిచ్చుచు మనమ్మున.

సీ. ఛాయావధూమన స్సారసభృంగమా! శర్వరథాంగమా! శరణు
శరణు। పరమభక్తార్పిత పాయసాన్నప్రియా! సద్గుణసముదయా!
శరణు శరణు। ఆశ్రితభక్త ఘోరాఘవారణసృణీ! గురుమణియత్పద్మ
మణీ! శరణుశరణు। పృథురత్నమయ రథాన్విత హరిత్సైంధవా!
శతపత్రబాంధవా! శరణు శరణు।

గీ. సర్వలోకసంస్తవనీయ శరణు శరణు
శౌరిపద్మజా భవరూప శరణుశరణు
నిరుపమాన నిర్మలకరా శరణు శరణు
పాహిమాం పాహిమాం పాహి పాహిపాహి.

వ. ఇట్లర్ఘ్యమిచ్చు సమయంబున గాధేయుండరుదేర దద్వార్త యెఱింగి ముందుగ జని నమస్కరింప కపట మనమ్మున గాధిచూలి నవ్వుచు.

గీ. గతయుగమ్మున నెయ్యది ఘనత కెక్కె
అఖల కవిపుంగవుల నెద్ది యాశ్రయించె
పుణ్యజనులు దేనిగని విమోహపడుదు
రట్టి దేవత నిన్ను జేపట్టుగాత.

వ. అని దీవింప త్రైశంకుండు మహాప్రసాదము భవద్దర్శనంబున బవిత్రుండనైతి మీరాక కారణం బెఱింగించిన నీదానుండా నెఱుంగున జేయంగలడన గౌశికుండు నవ్వి.

తే. శివునకు బ్రీతిగ నేనొక్కక్రతువు జేయబూని దీక్షితిని
రవికులతిలకా! దానికై గొంతద్రవ్య మడుగవచ్చితిని.

వ. కావున మూడుభారముల ద్రవ్యమిచ్చిన నాసంకల్పము సంపూర్తి కాగలదన విని ధనాగారమ్మునంగల ద్రవ్యము కావలసినంత పుచ్చుకొమ్మని హరిశ్చంద్రుండు పలుక గాధేయుం డాశ్చర్యమంది త్రిశంకునందనా! మాకు నీవంటిదాత యుండ లోపంబులేదు మాకవసరము వచ్చి నప్పుడడిగెద నంతదాక నీచెంతనుంచుమని గాధేయుండు జన జంద్రమతీ ప్రియుండు మనమ్మున.

నాదనామక్రియ — ఆదితాళము.

నేనేమి సేయుదు నిరాబారి పనియెను॥ నే॥

నే నొసంగినట్టి ద్రవ్యచయమా మానీంద్రుడు దీసికొని చనినచో
నూనభాణవైరిని స్మరియించుచు నానగరమ్మున నుందుహాయిగ॥ నే॥
అతడల్గిన శంకరాదులైన భయంపడుదురు ఋణముంచిచనినిమనే
తతినసుగును తెలియదు భాలాజీ దాసావను డెలుగు నీమఱుగు॥ నే॥

వ. ఈగతి చింతించు తఱి విశ్వామిత్రకల్పితంబగు జంతువులబాధ సహింపలేక కాపువాండ్రు ప్రభువు నాలోకించి చేతులు జోడించి.

నాదనామక్రియ—త్రిశ్రగతి.

వేలేలేలేలేలే రాజా! వింతమెకము లరుదెంచె వినుమో మహారాజా!॥
వేల యీనినట్లు పెద్ద వాలుమెకము లరుదెంచె॥ వే॥
పైరులన్ని మేసి పరుగున మముడాసి
ప్రాణానికి గాసి పరచెను గుణరాశి
తొలగి గుడ్డపేలిక తో వచ్చితిమి ఫాలక
నిలువలేము పాలి కాపుల గావు మేలిక
వాటి జంపకున్న మా పాటికేగమన్న యీ
పూటమాకుబస్తు కట్టబోమిక మీాశిస్తు॥ వే॥

వ. ఇట్లు విన్నవింప నరేంద్రుండు వారలకుం గల వంతదీర్చెదనని యభయం బొసంగి భార్యనవలోకించి కోటమిన్నా! వేటకొరకై వింధ్యాటవీతీరమునకుం జనవలసి వచ్చినదన విని సతీతిలకంబాశ్చర్యం బంది.

కేదారము—త్రిపుటతాళము.

ఇంత యకస్మికంపు వేట యేలరా? యో ప్రాణనాధా!॥ యింత॥
వింతదోచె సకలభూతవితతిని మీప్రాణముగతి భా
వింతురుగద సదా వినుతమదవిదార పరమోదార రుచిజితమార॥
ఇనకులప్రదీపా! జీవ హింసకులు బీ భాలాజీవర
దుని సత్కరుణకు పాత్రులుగారనిగదా మాంసవర్జితుండవైతి ॥ విం ॥

వ. ఇట్లన ప్రేయసీ! జంతుబాధచే వంతనొందు ప్రజలకు వాగ్దాన మొసంగుటచే కారడవికి బోవలసివచ్చినదన జంద్రమతి విని నాధా! యడవి జూడ వేడుక బొడమి యున్నది గాన నే నరుదెంచెద ననిబల్క నేలమగండు సతీసుత సమేతుండయి విపినం

బునకే తెంచి జంతువులనదలించి కాపులబాధ మాన్పి మఱల నింటికి వచ్చుచు మార్గమధ్యమున విశ్వామిత్ర ప్రేరితంబగు.

సీ. ఇంద్రనీలపు గాంతి నేలు కన్నులతోడ ముద్దులుగుల్కు నెమ్మోము తోడ। పగడాల జిగిమాపదగు వీనుగవతోడ గమునల్లనైన శృంగ ములతోడ। ముత్తియమ్ముల సౌరు నెత్తు చౌలలతోడ నపరంజి నేలు మేని పసతోడ। మగరాలక్రొందళుకు నగులో దొడలతోడ బుడుత జాబిల్లి డాల్కడుపుతోడ.

గీ. దొడ్డ డెక్కలతో బొట్టి తోకతోడ
గాలిపేరెమ్ము నడచు వేగమ్ముతోడ
బిత్తరపు జూపుతో నేలన త్తియత్త
నటుల వడిజింకరాగ త్రేడక్టచూచి.

వ. విస్మయమంది భార్యయుం జూపుమందునంత లోహిత కుమారుండు దాని నవ లోకించి తండ్రిని బిలిచి

నాదనామక్రియ—ఆది తాళము.

బాబా! చూడుమా వచ్చుచున్న పసిడి యిఱ్ఱిని ॥ బాబా ॥
(శ్రీ) బాలాజీవరగుని చేతనున్న జింకరీతిదిని॥ బాబా॥
చూడు చూడు దాని బోయుగమ్ము నేను లేడిదెచ్చియిచ్చిన నా
మేడచెక్కి మీదగట్టి పచ్చిక మేపి దానితోడ నాడుదు ॥ బాబా ॥
కోటలోన నున్న జింకదీనికి సాటిరాదు గనుము దానివంక
బూటకమ్ముగాదు తేకయున్న బువ్వదినుట నేను సున్న ॥ బాబా ॥

వ. ఈరీతి నడుగు కొమరుని ముచ్చటదీర్ప నెంచి భూపాలుండు వెట్టిమై యిత్తి వెంటనంటిజన నది కౌశికుని యాశ్రమమంబునకు జని మాయమయ్యె. నంత పల్లవకల్పితంబగు శయ్యపై జంద్రమతీ యూరుపీఠంబున శిరమునుంచి నిద్రించు తతి సతీతిలకము చిగురు టాకులతో జేయంబడిన వీవనచే చల్లని గాలిసోకునటుల మెల్లన వీచుచుండగా భూవల్లభుండు చెడుగు కలగని దిగ్గునలేచి గడగడవడకుచు గన్నీరు విడుచుచు భార్య నాలోకించి.

మైకవసి—ఆది తాళము.

ఏమని దెల్పుదునో చెలియా! ॥ ఏమే ॥
సోమనిభాస్యా! నామనో రహస్య ॥ ఏమే ॥

కొలువున బెద్దలగూడియుండ దలమీది రత్నకలిత కిరీట
మిలగూలినట్టుల దన్ని కేశములబట్టి యూరివెలపల కీడ్చిన
పలువిధముల బాధలనుభవించి పడపడి బాలాజీవరదుని కృప
విలువలేని సౌఖ్యమొందినట్టుల కలగంటి నాతొంటికృతమిదియంటి॥

వ. ఇట్లని కడు చింతింపుచున్న సాధ్వీమణి విని మిగులభయమంది పయికి భయములేని దానివలె నటించి వల్లభా కల కల్లనిదెలిసియు నిట్లు జింతింపం బాడియే ధైర్యమూనుండని వలుక నామాటనమ్మక రాజు మిగుల బాగులుచున్నంత నక్కటా మక్కువకాడు మిక్కిలి బొక్కుచున్నాడు దుఃఖమును బోదోలు మహిమగల గానవిద్యాప్రవీణు లెవ్వరయినవచ్చి పాటబాడ రాచమేటివిచారమాపిన బాగయుండునని యండజయాన యోచింప విశ్వామిత్ర కల్పితంబగు మాలకన్నియ లిర్వురు.

సీ. సాంబ్రాణి తైలమ్ము జరిమి కొప్పులువెట్టి కడుదావిగల పూలు
ముడిచి ముడిచి । కనుదమ్ములకు కాటుకలువెట్టి కస్తూరితిలకమ్ము
నుదురుల దిద్ది దిద్ది । వింతచీరలగట్టి విలువసొమ్ములు వెట్టి తోరంపు
గుబుసముల్ తొడిగి తొడిగి । ఏవ్వేళ బలుతావులీను తైలమ్ముల
బునుగు నెమ్మేనుల బూసి పూసి.

గీ. గలువజేసిన చేరుమాళ్ళెలమిబట్టి
తగిన తంతి జంత్రముల హస్తములబట్టి
వయసువారికి నేత్ర పర్వమగునటుల
మాలెతలువచ్చి భూపతిమ్రోల నిలిచి.

హిం॥ భయిరవి—త్రిశగతి.

రాజశేఖరా! రిపు రాజ భీకరా! ॥ రా ॥
ధీజనానుకూలా! దినేంద్రకుల శీలా !
మచ్చికతో భవదీయ సమక్షంబున బాటబాడ
వచ్చినాము బాలాజీభక్తా! గానానురక్త ॥ రా ॥

వ. ఇట్లు మాలగరితలన నేలమగడు వారలంగని మీమీ విద్యాకౌశల మిప్పట్టున వెల్లడింపుండన వల్లెయని పల్లవాధరులు భూవల్లభునిపై దృష్టినిల్పి హస్తవిన్యాస మొనర్చుచు.

హిం- భైరవి—త్రిశ్రగతి.

ఉఠో ప్రియా! జాగో జీయె కేలిడగురులాగి ॥ ప్ర ॥
గజరగజరాసైన పేవి ప్రియా! ధర్మజాగో
పోతిథిసైు నీంద్కేమారె గజరాచోక్ చురాలియా ॥ వృ ॥

వ. ఈ గతి గానమొనరింప నా హరిశ్చంద్రుండు సంతసించి కొంత ద్రవ్యం బొసంగ నాగొసంగి పడంతులు నగుచు నరనాయకు నవలోకించి.

గీ. ఏమి చెప్పుదుమయ్య పూర్వోదరమున
మమ్ము బాధించుచున్నాఁడు మన్మథుండు
నేఁడిటుం జేర్చి కడు సంతసమున మమ్ము
గూడినంజాలు నదియె మాకు బదివేలు

వ. ఇట్లు చండాలకన్య లడుగ భూవల్లభుండు హరహరాయని చెవులు మూసి కొని వెలందులారా! నేనేకపత్నీవ్రతుండనగుట మీ యభీష్టము దీర్పనవకాశము లేదు గాన నింతటితో దృప్తినొందిపొండన వారలు మాకోరిక దీర్పకున్న నీనగలు విత్తమవసరము లేదని రాజును వంచించుటకై శృంగారచేష్ట లనేకముగా జేయుదొడంగిన నృపాలుండరుణలోచనుండై కొరడా చేబూని వారల బాధింప నరుదెంచు సమయమ్మున సత్యకీర్తి - హరిశ్చంద్రుని చేయి బట్టుకొని.

చ. అబలలబట్టి కొట్టుటకునై కొరడాకై బూని వచ్చుటల్
సబబనిదోచెనే? సతులు సైపుదురే కశాదాడనంబునై
రిబలమదంబణంచి కడలేపయశమ్ము గ్రహించుటుర్విలో
సొబగు నృపాధనాధులకు సూర్యకులాంబుధి పూర్ణచంద్రమా!

వ. ఇట్లని నృపతికింగల కోపంబు వారింప నంత చండాలకన్య లిర్వు రాకరితో నొకరు

కాఫి—ఆది తాళము.

ఏలామనకు వానిజోలి చెలి ॥ యేలా ॥
పూలవిల్తుకేళిలో నేలుమనుచు బ్రతి
మాలిన మన కను కూల పడడయ్యో నిక ॥ యేలా ॥
అల బాలాజీవరదుఁడా చలిమలపట్టి విభుసితో
మలమాగు నాధేయుసితో దెలుపుదము కలిక మగుములికి ॥ యే ॥

వ. ఈగతి నగికొని కొప్పులువిప్పి గాజులు బ్రద్దలగొట్టి మేనెల్లరక్కుకొని వీత రాంగుడై నాతు లేతెంచి గాధేయు నవలోకించి.

తో. జనకా! యేమనిదెల్పుదు మాభూజాని చాలకోపమునన్
కనికరింపకయె మమ్ములగొట్టెన్ననుగొను మామాయెడలన్.

వ. ఇట్లా నాలచిగురు బోండ్లు విన్నవింప గాధిచూలి చిందులు ద్రొక్కుచు నేమేమీ నృపాధముండు మిమ్ముల బాధించెనా? సరి సరి నాకోపాగ్నిని వాడే తెలం గున భరించునో చూచెదనని చట్టున వచ్చి కిరీటము నెడమ పాదమ్ముల నేలగూలినటుల దన్న వామన్ను లేక ద్రన్నవచ్చి మౌని పాదమును బట్టి.

ఉ. ఏంతటి నొప్పిపట్టెనదో హీరమణీనుయమౌ కిరీట మ
త్యంతము దాక మీామృదుపదంబునకు న్గుశికాత్మజాత! మీా
రింతటి యల్కబూనుటకు నేనొనరించిన లోపమేమియో
శాంతివహించి నాానికులచంద్రమ తెల్పవె మీాకుమ్రొక్కెదన్.

వ. ఇత్తెఱంగున హరిశ్చంద్రుండన గాధేయుండు గన్నుల నిప్పులురాల్చుచు బద ఘుట్టన మొనర్చి.

భైరవి—ఆది తాళము.

వినుమోరసీవప రాధివిగానటరా నృపా ॥ విను ॥
ఇనకులాధమా ప్రాజ్ఞుడవని మనమునదలచియుంటినోరికొంటి ॥విను॥
పుడమిాశులు లేరో? వేటకై యడవులకుంబోరో? యీా
పడతులపై యనుకంపవహింపక బట్టితివట తిట్టితివట కొట్టితివట॥
తులువా! నాతోటకరుదెంచి జంతువుల గీటడంచి మఱి
నలపసిడి యిట్టినెంటనంట యీా యాయసముగలిగించి కడు
నలుకబూని నాముద్దుకూతుల నటమట నొందించియుంటి విక
తొలగి యెటులబోయెదవు బాలాజిని పలుమరు రక్షించినట్టి యీా
జలజారివాళినికు దోడ్పడిన జడువనురా? విడువనురా? యిదివినరా॥

వ. కౌశికుండిట్లన రాజు భయభ్రాంతుండై కరములు మోడ్చి.

గీ. కొడుకు లవివేకులై జేయుదుడుకు లెల్ల
సైప రే? తల్లిదండ్రులు సంయమీాంద్ర

కోయుదురె తూటికూర వజ్రాయుధమున
గోప మిారీతిజూపిన నోపగలనె?

వ. కావున నాతప్పులు సైరింపుండన గాధి నందనుండు విని నవ్వుచు భళిరా హరిశ్చంద్రా నీపయి మాకు దయవచ్చినది.

ఉ॥ చూడు మదీయ పుత్రికల సుందరత న్ఘనగోటికైన నీ
మూడు జగంబులందు సరిబోలరు స్త్రీలెవరైన మారుమా
టాడక నిలతాంగుల దయన్గని కౌగిటజేర్చి వారలన్
గూడితివేని నిన్ను నలగోపతి గద్దియపైని నిల్పెదన్.

వ. ఇట్లన జంద్రమతీ ప్రియుండు గాధేయుం గని.

క. కులమున గల ధర్మంబా
వలనిడి మాంలెతలగూడి స్వర్లోకసుఖం
బులనెల్ల నొంత జెప్పిన
గల రాజ్యంబైన విడుతుగాని మునీంద్రా!

వ. ఈరీతి భూపాలుండన నగ్గాధినుతుం డాతనిం గని.

కాల్యాణి—ఆది తాళము

మాట దాటరాదు నీవన్న ॥ మాట ॥
మాటిగ బాలాజనేలిన గంగా జూటని పదమాన ముజ్జగాన ॥మాట॥
మనుజనాథ! నీరాజ్యముమాకు సమర్పించిపొమ్మ కనుమువిపిసమ్మ
జనులకానవాలుగనీముద్రికనరగనిమ్మచిరసుఖమ్మగలుగునజామ్మ ॥

వ. గాధి నందనుండిట్లన రాజు నవ్వుచు.

ఉ. పంటవలంతి నేలి పిదపం దపమెంతయొ జేసి కీర్తిచే
నుంటిరి మూడులోకముల నుత్తమసౌఖ్యము మాని క్రమ్మఱం
దొంటి యవస్థనుండ మదిదోచిన బ్రాహ్మణదత్తమైన మ
న్నంటక తక్కురాజ్యరమనంతయునైగొనుమా తపోధనా!

వ. ఇట్లని రాజ్యముదారబోయ నరని సాహసమునకు గాధేయుం డాశ్చర్యమంది రాజా! హరిశ్చంద్ర! నీరాజ్య రమనుమా కొసంగితివి గాన నా స్వాధీనమందున్న భూ

మిలో నీవుండగూడదు గాన నిచ్చటి నుంచి బొమ్మనవల్లెయని పుత్రకళత్ర సమన్వితుం డయి యడవికి బోవ నుద్యోగించు సమయంబున గౌశికుండాతనింగని రాజా! వాడు యథార్థమై వాగ్దత్తమొనర్చిన ద్రవ్యం బిప్పుడొసంగు మన హరిశ్చంద్రుండు విని ముని కుంజరా! రాజ్య మంతయు మీకు సమర్పించి బడుగునైయుండ నింతటితో దనివి జెం దక ఋణముమీద నుంచుట తెల్లునా యన గాధి చూలి కన్నులెఱ్ఱజేసి భూపా! కొంచ మైన యోచింపక నిట్లు బలికినందుకు వింతగా నున్నది.

తో. ఈరాజ్యము సవనము జేయుటకై యిచ్చితివేమో చెప్పు
మోరాజా! సత్యమ్ము నిల్పుకొన నూహయున్న నిదు మప్పు
ఋంచుకైన మనమున దలపోయక నీగతిబల్కుట దగునా
మంచిది తెల్పుము మాఋణమెపుడు సమర్పించెదవో సుగుణా!

వ. ఇట్లు గాధి సుతుండన జంద్రమతీ ప్రియుం డవలోకించి.

కం. ఓ దయాంబుధీ! ముప్పది దినముల లోదీర్చెద మీ ఋణము
ఆదివసంమున కీయకున్న నన్నమ్మి గొనుడు మీధనము.

వ. ఇట్లు హరిశ్చంద్రుండన గాధి పుత్రుండంగీకరించి నక్షత్రకా! యిటు రమ్ము వీని వెంటబొమ్ము మన ఋణము దీర్చుకొమ్మని పలికి వానిచెవిలో నక్షత్రకా! నీవు వాశిష్యుడవైనందుకు భూపతికెన్ని బాధలు పెట్టియైన దబ్బర లాడించితివేని దా నినే గురుకట్నముగా నెంచెదనన బాపండు వల్లెయని హరిశ్చంద్రుని వెంటనంటి జను చుండ గాధేయుండు సత్యకీర్తికి రాజ్యంబిచ్చి యదృశ్యాకారుడై నరనాథుడు జను మార్గమధ్యంబున ముండ్లు గొప్ప రాళ్ళుండు నట్లొనర్చుచు నీరు దొరకుండజేయుచు నధిక బాధలం బెట్టుచుండ వారు గట్టికష్టములనుభవింపుచు జంద్రమతి హరిశ్చంద్రు నవలో కించి ప్రాణేశ్వరా!

నవరోజు—ఆది తాళము.




నడుమ జాల పుడమి పాల! ॥ నడు ॥
ఒడలు చెమటలెక్క దనువు స్రుక్క
నడుగులు దడబడె నడువసి యాగె ॥ నడు ॥
పొదల నడుమ బోవుచుండ గట్టిన పుట్టమెల్ల జిరిగె ముండ్ల చేత
పదములబొక్కులుదోచెనునాచం కదిగను మనలోహితుండు కటకట

నాపయి కరుణించి మెల్లమెల్లగ నడువుడు పాలిత బాలాజీకృప
యీపగిదిని గలదాతపసికిమన మేమిజేసి నారమిట్టు లోనరించె

వ. చంద్రమతి కన్నీరునించి యిట్లనుచుండ హరిశ్చంద్రుండు కుమారు నెత్తుకొని భార్యచేయిబట్టి మెల్ల మెల్లన నడుచుచు మనమ్మున.

నాద నామక్రియ—త్రిపుట.

అక్కటా? యీసతిపడు ప్రయాసమెట్టుల జూచియోపుదు ॥ నక్క॥
ఇక్కలికిమిన్న నానిమిత్తమీగతి నుండ వలసివచ్చె ॥ నక్క ॥
వాడె మోము దమ్మి క్రొమ్ముడివీడె నడుగుదోయి క్రిందిపార
లూడె దీని నెమ్మొని కాంతి మాడెగంటినీరు రయికపై నోడె॥నక్క॥
మేన జెమటలూరె బెదవులు మిగుల బీటవారె బాలా.
జీనేలినహిమనగాత్మజా జానిని నమ్మినందుకా యీగతి ॥ యక్క ॥

వ. ఈగతి జింతింపుచు భార్య నూరడింపుచు ధైర్యము జారనీయక జనుచున్నంత దొంగ బడలిక దెచ్చుకొని నక్షత్రకుండు నేలంబడి.

చ. అలసితినయ్య భూమిపయినానవు పాదములయ్య దప్పిచే
గళముఖమెండెనయ్య గురుఘర్మకణంబులు దోచెనయ్య శీ
తల సలిలంబొసంగినను దబ్బున నీడకు జేర్చి ప్రాణముల్
నిలుపకయున్న బ్రాహ్మణుని నెట్టినదోసమునిన్ను జెందదే

వ. ఇట్లన జంద్రమతి భర్తంగాంచి మన కుమారునైన విడిచి యీవటువును గాపాడుట యుచితంబన నరనాథుండా కలికి పలుకులకు మిగుల సంతసించి నక్షత్రకునకు గేలూతనిచ్చి.

కల్యాణి—ఆది.

నడుమానీడకు వే ॥ నడు ॥
కడుచల్లని జలమును ద్రావించి బడలికదీరగ నడుగులొత్తెద ॥ నడు॥
పదియడుగుల దూరముగలద దెవట
పాదపమ్ము వేగిరమ్ము లేచి ॥ నడు ॥

వ. ఇట్లని యావటువును మెల్లన నడిపించుకొని యొక కమలాకరంబును సమీపించి చల్లని నీటిచే వీరల దృష్టి జేసి తాను స్నానంబొనర్చి సంధ్యవార్చి కొంతజల మాస్వాదించి యడవుల ద్రిమ్మరుమండనింత.

సీ. స్నాన సంధ్యావందనముల గావించు విప్రులవిచారమ్ములో ముంచు
నెద్ది । ఇలగల విప్రయోగుల కన్నుదోయికి పెనుభూతముగ గాను
పించునెద్ది । ఆలస్యముగ పానశాల కేగెంచెడి జనుల చింతాబ్ధిలో
జొనుపునెద్ది । యింటను జొరరాని యిందీవరాక్షుల పాలిటకుంత
మై బరగె నెద్ది.

గీ. అట్టి చలికాలమే తేర నవనిలోన
మానవులు జెప్పగల బుద్ధిమంతులగుట
గొన్ని సదుపాయముల జేసి కొనిరి గాని
తలప నల జంతువులకు నాధారమెవరు.

వ. ఇట్టి చలికాలమ్మున గట్టిదుమలననుభవింపుచు ముందు జనిచని యొక మఱ్ఱి చెట్టుక్రింద జేరి కసవు శయ్యగల్పించి నక్షత్రకుని దానిపై బరుండబెట్టి పైటకొంగుబరచి కుమారుండు జంద్రమతియును నిద్రింపుచుండ హరిశ్చంద్రుండు భార్య నవలోకించి కంట దడిబెట్టి మనమ్మున.

సీ. చలువ తోటలలోన సంచరించెడి లేమ యడవి భూములయందు
నడువవలసె । నెలగాలపై గమనింపుచుండు నెలంత కఱకు రానేల
పై దిరుగవలసె । ఆరు రుచుల తిండి నారగించెడిచాన దుంపలచే
బొట్టనింప వలసె । మేడ మెట్టులనెక్క నోడు సాధ్వీమణి యద్రు
ల నల్లాటమాడ వలసె.

గీ. అకట నాపాలబడి యిట్టు లనుభవింపు
చున్న దీతలోదరి నన్ను గన్న తండ్రి
లోహితుండల బగ్గిలలో షికారు
జనెడి వానికి నీగతి సంభవించె.

వ. ఇట్లు వితర్కించు సమయమ్మున శేతాలుండరుదెంచి పండ్లు గొఱుకుచు.

భైరవి—ఆది తాళము.

నరాధమా! యెవ్వడవురా యేలవచ్చితివిరా ॥ నర ॥
బిరాన సింగము దరికేగిన కరి తెఱంగునవచ్చి నాచేతజిక్కితివి ॥న॥
బాలాజీదాసుని రక్షించిన పాలాక్షుడు నీకడ్డము వచ్చిన
వ్యాళముకప్పను మ్రింగి నగతినో పాలసా! నిన్నట్టెబట్టి మ్రింగెదర॥

వ. ఇట్లు బేతాళుండన నరనాయకుండాలోకించి నీకు ప్రాణములమీద నాశ యున్న వచ్చిన త్రోవబట్టి పొమ్ము లేదా యుద్ధమునకు రమ్మనగా బేతాళుండు గదియ నిరువురు ఘోరసమరము జేయ రాను రాను బేతాళుని శక్తితగ్గి శరణు జొచ్చిన రాజు కనికరహృదయుండై యింతటినుంచి నాకింకరుడవై యుండుమని జెప్పి యవ్వోటు వాసి నచ్చుచు దారినడుమ నడ్డముదగిలి కారుచిచ్చును గడిచి కాశీపురము సమీపించి గంగానదీ జలస్నానమాచరించి విశ్వనాథాలయము జొచ్చి మనమ్మున.

సావేరి—ఆది.

శంభో! హర హర శంభో శివ శివ ॥ శంభో ॥
కుంభిదానవనూదనా దిగంబర జంభవైరిపూజిత చరణయుగళ॥శంభో॥
మేరుచాప చిత్స్వరూప ధవళాకార పాపహర భుజగకలాపా!
దిక్కులేని వారలకును నీవేదిక్కని మదినమ్మి
మ్రొక్కితినీ యనుగు దమ్ములకు నమ్ము బ్రోవగ నిటురమ్మి
పక్కి కన్న దక్కువయ్యె నిక మా బ్రతుకుం గనుగొమ్మి
అక్కటకటా యిట్టి యిడుమలెవరైన బడరు జుమ్మి
మక్కువ నామార్కండేయును మీ ప్రక్కజేరి కౌగలించి వేసిన
దక్కినంపు సామిని శాశించిన దానవచయహరణ మారుత
భుక్కపాల భరణ మానిగణ
పూజిత మృదుచరణ మాకుగల దిక్కు గ్రోసి కరుణ నేలు
బాలాజి దాస శరణ భవతరణ ॥ శంభో ॥

వ. ఇట్లు శంకరుని ధ్యానించి యొకరమ్యప్రదేశంబు జేరియుండ నక్షత్రకుండు రాజా? గడువు కాలము సమీపించినది యిదివర కొక పయిసాయియ్యలేదు నీయొద్ద ద్రవ్యమున్నట్టు కనుపడదు గావున మాయప్పు తీరుమార్గమూహింపుము లేదా.

మంజరి.

వారణాసిలో నైదుదినంబులు వసియించినట్టి వారు
ఘోర పాపరహితులై ముక్తిచే కొందురంద్రు పదియారు
దినములయ్యె నిచ్చోటికి నీవరుదెంచి గనుక మోక్షమ్ము
జనవర కరగతమయ్యె లకుబొంకిన జెడవు నిహపరమ్ము
లరకాసైన లభింపనేరదీ పురమున గాన ఋణమ్ము
నెరుగవనుచు బల్కుము నేనిపుడే నరిగెద మాటలునమ్ము

వ. ఇట్లన హరిశ్చంద్రుండు నక్షత్రేశ్వరా! స్త్రీలయెడ వివాహములందు ద్విజ గోరక్షణముల ధనమాన ప్రాణభంగముల బొంకినను దోసమబ్బదని శుక్రుండు బలికి నుపదేశించినట్లు నన్ను మూర్ఖునిగాదలంచి నాకు జెప్పుచుంటివి పరమేశ్వరుం డొకచోటనే యుండువా? యీస్థలమే బవిత్రమై జనులకు మోక్షంబొసంగునా? సకల జీవాధారుండగు పరమేశ్వరునకు విశ్వమంతయు నిలువ నాలయంబేగదా?

మంజరి.

మోసము విపత్తు లెన్నియైన జేకూడిన ధనరాజ్యమ్ము
లోడిన ప్రాణములూడిన మర్త్యుండాడరా దసత్యమ్ము
బొంకినమానవుడ ఘురాహిత్యము బొందగనేరండెపుడు
బొంకుదునే? యల్పసుఖము కొఱకై పూర్ణముగ దెలిసియిపుడు

వ. పాత్రకు నూది బెజ్జంబంత రంధ్రముంచిన కడివెడుజలము గారునట్లు పాపము నకింత సందుగలిగిన బుణ్యారాసులు సమసిపోవునను సంగతి మీరెఱుంగరా? కావున నిట్టి మాట లావల గట్టిపెట్టుడన నక్షత్రకుండు విని రాజా! నేజెప్పినట్లు జేయ నీయకొనకుండిన ఋణము దీరు మార్గంబాలోచించుము నేసత్వర నిజనివాసంబు జేరవలెనన భూపతి మారు బల్కలేక మోమువంచి కడగంటను భార్యముఖ మాలోకింప నంత నక్షత్రకుండు రాజు నవలోకించి.

గీ. చూచివాని గతి నిటు నటు దిక్కులు జూచిన లాభంబేమి
దాచితివా ధనమప్పు దీర్పనాలోచింపుము భూస్వామి.

వ. ఇట్లన భూపుండేమియు ననసేరక జూచుచున్నంత జంద్రమతి వల్లభు నవలోకించి.

నాదనామ క్రియ—ఆది తాళము.

చింతింపనేలా? భూపాలా! బుధనుత శీలా! ॥ చింతి ॥
అంతటిదశ యింతకు వచ్చెనిక యెంతటి యవస్థ రానున్నదో మన
వంతుకు వచ్చినది యనుభవింపక పరులనుభవింతురే? ప్రియా!
పుడమిఱేడులకు గీర్తియే ధనము విడువరాదు ధైర్యమెట్టియిడుముల
బడిన నన్ను ఋణముదీర్ప నన్నంగడిసిబెట్టి విక్రయింపుడు ॥ చిం ॥
అప్పుదీర్ప నింతకన్న వేరు యొప్పుగానరాదిగతి జేసిన
తప్పక శ్రీలాజీనేలిన గౌరీ ధవునకు సంప్రీతి కాగలదు ॥ చిం ॥

వ. ఇవ్విధంబున బలుక త్రైశంకుండు కోటి మిన్నా పడంతి నమ్మి బ్రతికిన పాపాత్ముం డెవ్వొట నెనం గలడా యన జంద్రమతి భర్తనువిలోకించి.

తోడి—రూపకము.

సందియ మొందనేలా యో నరపాలా ॥ సంది ॥
అందరికిని సుఖ దుఃఖము లరయసమము జుమ్మీ ॥ సంది ॥
గజబిజ లెందుకు దోసము గలదె కల్లకన్న
నిజముకన్న లేదిలపుణ్యంబు రాజ మిన్న
అరలి ప్తలో బోవు భార్య నమ్మిన దోసమ్ము
అన్నృత మాడు దోసము బా యగ నెవరితరమ్ము
పాలిత బాలాజీపై భారముంచి నన్నమ్మి గుణ
జాలా! ముని యప్పుదీర్చి యశము నుజేకొమ్మి ॥ సంది ॥

వ. ఇటులం బలుక హరిశ్చంద్రుండు వల్లియని యీపల్లవోష్ఠిని యంగడికిందో కొని పోయి పౌరులారా! నాపేరు హరిశ్చంద్రుండు నే సూర్యవంశసంజాతుండ త్రిశంకు నందనుండను నారాజ్యంబంతయు గాధేయునకు సమర్పించి మఖార్థమై వాగ్దానం బొన ర్చిన విత్తమీయంజాలక నాభార్య నమ్మనీయకొంటి గావున.

సావేరి—ఆది తాళము.

మిగుల చౌక బేరమిదియు జూడుము మోలతను గొన రండు ॥ మి ॥
మగువ త్రిశంకుని కోడలు దీనిపనిగనుగొన్న సంతసింత్రు ప్రోడలు
నవ్వులాటకైన దప్పుగూయదు నాతిమిన్న చెఱుపుపనులు జేయదు
బువ్వబెట్టు వారిమాట ద్రోయదు పుణ్యకార్యములకు వెనుకదీయదు॥
పరపురుషుల దమ్ములని దలంచు పసులసొమ్ము దృణముగ భావించు
నిరుపేదల గన్న సత్కరించు నిరతము బాలాజీని స్మరియించు ॥మి॥

వ. ఇట్లమ్మజూపినంత సూర్యుండు దన కొమరుండగు శనైశ్చరుని రావించి మన వంశజాతుండగు హరిశ్చంద్రుని గాధేయుండు బలుచిక్కులు బెట్టుచున్నాడు గావున నీవేగి యావిత్తమిచ్చి వారల గౌశికుని స్వాధీనమువంపించి వారి యశము ముల్లోకం బుల వ్యాపించి నట్లాచరింపు మన కలిరాజు వల్లెయని వృద్ధబ్రాహ్మణ వేషమూని కాల కౌశికుండను నామునంబున వచ్చి హరిశ్చంద్రు నవలోకించి.

ఝుంఝూటి—త్రిశ్రగతి.

ఎవడవురా నీవు యిందేల వచ్చినావు ॥ యె ॥
అవమానంబనక భార్య నమ్మ జూపెదవు ॥

ఆలిసి మర్యాద జేయక నమ్మట తప్పు గాద
చాలు మాతిమీాద మోసంబు నీకు లేద ॥ యె ॥
వినరా దోసకారి నీ వితర దేశము జేరి
వనబోణి దొంగిలించి నావని వింటి రోరి ॥ యె ॥
రాజభటులు విన్న నీ లావడంతురన్న బా
లాజీ వరదుని సాక్షిలలన విడువకున్న ॥ యెవ ॥

వ. ఇట్లు కాలకౌశికుండన నరనాథుం డాతనింగాంచి బ్రాహ్మణోత్తమా నీకీప్ర సంగమేల కొనుటకు శక్తికలదేని మూడుభారముల ద్రవ్యంబిచ్చి మెలంతను గొనిపొమ్ము లేదేని వచ్చినత్రోవబట్టుమన వాకాలకౌశికుండు ముబ్భారముల విత్తంబొసంగి సతీతిల కంబును రమ్మన నవ్వేలదభర్తనవలోకించి నాథా! నేజనియెద బూర్ణానుగ్రహముంచు మని పదములపై నొరగినంత రాజచూడామణి భార్య రెండుచేతులు బట్టి కంటినీరునించి.

సీ. అర్ధాంగినైన నిన్నాదరింపగ లేక విధివశంబున నేడు విడుచుచుంటి।
దాసీజనులవల్ల దగుసేవగొను నిన్ను బనికత్తెగా నేడు బంపుచుంటి।
ముద్దు మాటలనైన ముదమొంద గొడుకుని చెంత నుంచునటంచు
వంత నుంటి । ఇంత కాలంబున కేకాంగినై యుండ వలసివచ్చె
నటంచు గలగు చుంటి.

గీ. పద్మభవువ్రాతదాట నెవ్వరి తరమ్ము
హీన! లేశెమ్ము యజమాని శాసనమ్ము
పగిదినడిచి శీలమ్ముగాపాడు కొమ్ము
కంట వడి జిమ్ము పారుని వెంట బొమ్ము.

వ. ఇట్లు లానరవిభుండన జంద్రమతి సుతుని వెంటబెట్టుకొని జనుచుండ లోహి తాస్యుండు దల్లిని విలోకించి.

నాటకురంజి—త్రిశగతి.

అమ్మా! మా బా బేడే ॥ యమ్మా ॥
బొమ్మలను దెచ్చుటకు వెళ్ళెనా ॥ యమ్మా ॥
ప్రీతిగల దూతలేరే పంచు కోతి రీతినున్న తాత యెవ్వడే ॥ య ॥
సీటుగల గుఱ్ఱము లేవే యీాపేటకు మనకోట కెంతదూరమె ॥య॥

వ. ఇట్లు కుమారుండడుగ జంద్రమతి కంటనీరునుంచి.

ఉ. మందనుదప్పు గోవు పెనుమల్లడి నొంది యదృష్ట హీనతన్
బందెల దొడ్డికిం జనినభాతిని కౌశిక మౌని మాయచే
నిందులనుంటి నాజనకు డీతడు ముద్దుకుమార నీమదిన్
గుందుట మాను నీదు జనకుం డరుదెంచును రేపు రేయికిన్.

వ. ఇట్లు కుమారునూరడింపుచు పారుని గృహముచేర వాకలవాకంటకి మగని జుట్టుబట్టి నామీద దీనింగొని తెచ్చితివాయన జంద్రమతి యమ్మా! మగడు గ్రుడ్డివాడయినను ముసలివాడయినను భర్తనే దేవునిగానెంచి సేవయొనరించి సద్గతినొందుట కులాంగనలకు న్యాయ మట్టియెడ నీగతిపతిని బాధింతురా నేపనికైగానరుదెంచితిగాని వేరొండు దలంప వలదన నాకునీతులు నేర్పుదానవాయని కొప్పుబట్టి భువిక్రిందుగ నీడ్చి పదతాడనంబొనర్చి హంసనారియని పేరిడిరి.

సీ. ఇలు గుమ్మముల నూడ్చి కలయంపి వేజల్లి సొంపుగా ముగ్గుల నుంప
వలయు । అంట్లు చక్కగ దోమి యప్పడంబులపిండి విసరి పెన్పిడ
కలు వెట్టవలయు । విస్తరంటలుగుట్టి వేగ నంగడికేగి కూరలు గొ
ని తెచ్చి కోయవలయు । మాతిండి యైన పిమ్మట లెంగిలినిదీసి కడు
శుభ్రముగ నిల్లు గడుగవలయు.

గీ. మిగిలినట్టి కూడిర్వురు మెక్క వలయు
సందబడి నంత దిన్నోలు సర్దవలయు
పగలు రాత్రులు నాకాళ్ళు బట్టవలయు
బైట జాపపై మంచులో బండ వలయు.

వ. ఇట్లాజ్ఞాపింప నల్లెయని కుమారుడు దాను పారునింటగల పనులొనర్చుచు వసియించియుండ హరిశ్చంద్రుండు సతి నమ్మిన విత్తంబు నక్షత్రకునికిచ్చి నమస్కరించి చనుమన రాజు నాబాపండు దిలకించి మాగురువుగారిద్రవ్యమిచ్చితివి నానిమిత్తమేమి యోచించితివన విని నక్షత్రకా మీగురుప్రయోజనమునుగురించి వచ్చితిరిగాని నన్నుద్ధరింపనరుదెంచలేదు గాన నింతటితో దనివినొంది చనుండన నక్షత్రకుండు రాజా!

తో. జనవర కారడవులలో వెనువెంటను దిరిగిన మాత్రమున
నను నీసేవ యొనర్చెడి భృత్యుడననుకుంటివే మనమున

వ. నీతాత గారి నవుకరు ననుకొంటివా నీయబ్బగారి నవుకరుననుకొంటివా కొంచ మాలోచింపుమన నయ్యా! యేలపరుష వచనములు పలికెదరు రెండురోజులలో మీకొసంగెదనన మంచిది యీవిత్తమేనాది గురువుగారి ఋణము దీర్పుమన హరిశ్చంద్రుండు.

నాదనామ క్రియ—త్రిపుట.

చంద్రశేఖరా! యీబాపండిటుల జేసె ॥ చం ॥
చంద్రబీజ పర్వత నిలయా! సర్వవలయ వినిర్జిత ప్రళయ! ॥ చం ॥
దిన ద్వయములో గాధేయుని ఋణముదీర్ప నేయుపాయము
గనుపించేదు బాలాజీ హృ ద్వనజమిత్ర పార్వతీ కళత్రా! ॥ చం ॥

వ. ఇట్లువితర్కించుచున్న నరపాలునాలోకించి రాజా! చింతింప నేలపరమేశ్వరుని కృప నీయందున్నయెడ యీదురవస్థ నీకేల మాఋణము దీరుమార్గమాలోచింపుము లేదా? లేదనిచెప్పుము చనియెదనన బ్రాహ్మణోత్తమా! మీఋణముదీర్ప సామ్మొంచుక యుగినరాదు నన్నమ్మి మీయప్పు దీర్చుకొనుండన వల్లెయని యంగడికి హరిశ్చంద్రుని దోకొని చని బజారునడుమ నిలువంబెట్టి నాగరులారా! యీతండు త్రిశంకుపుత్రుండగు హరిశ్చంద్రుండు విశ్వామిత్ర ఋణముదీర్ప నుపాయంబులేక విక్రయింపుమని నిర్ణయింప నీతని విక్రయింపబూనితి.

సీ. అలగాధి నందనుండడుగ నామానికి బుడమినంతయుధారపోసినాడు
ప్రజలు సంపదలచే వర్ధిల్లుచుండు నట్లెడు దీవుల ప్రీతి నేలినాడు।
గర్వంబుచే గారు కానలలో సంచరించు బేతాళు జయించినాడు।
భరియింపరాని యాపదలంటుకున్న దబ్బరలాడనని బట్టుపట్టినాడు॥
గీ. దినమణి కులమ్మునకు వన్నె దెచ్చినాడు
ఏకపత్ని వ్రతాంబుధి నీదునాడు
కనుక మూడు భారమ్ముల ధనమొసంగి
వీని గొనిపొందు వేరండు విబుధులార!

వ. ఇట్లు విక్రయింపసమకట్టిన సూర్యనందనుండగు యముండు వీరబాహుండను నామంబున చండాలరూపంబున నరుదెంచి వీని నేను కొనియెద నన రాజు విలోకించి చండాలా! నీవెక్కడ బాపండడిగిన విత్తమిచ్చుటెక్కడ నన్నెక్కడ కొనుటెక్కడ నీదురాలాపంబులు చాలింపు మన వీరబాహుండు రాజా! మాటిమాటికి చండాలా యని నిరసింపుచుంటివే.

త॥ భూపా! మనయిరుపురకు స్భేదముజూపు మధికద్రవ్యమ్ము
చేపిన దాసులుగలరు నాకు నితోపనిలేదు నిజమ్ము॥

వ. ఇవ్విధంబున బలికి బాపండడిగిన ద్రవ్యంబొసంగి రాజును వెంట దీసికొని చండాలవాటికకుం జని రాజా! నీవు దాసుండని నామం బిడితి.

సీ. మిగుల చౌకగవచ్చు మెత్తని చర్మము ల్గొని తెచ్చి చెప్పులు గుట్ట
వలయు । రాత్రియామములందు రాజవీధుల జోటి గట్టిగ టమ్కట
మా గొట్టవలయు । శవల పీన్గుల బ్రేతభూమికి దెచ్చువా రిచ్చు
సుంకము ల్పట్టవలయు । గ్రామాంతముననున్న గ్రామసూకరముల
బిలిచి యాహారంబు బెట్టవలయు ।

గీ. పాయగిలు పందులను దెచ్చి మూయవలయు
రేయిని బరుండ నాకాళ్లు రాయవలయు
తోయముల నాకు నప్పు బోయవలయు
తీయ కల్లు సారాయి నాకీయవలయు.

వ. ఇత్తెరంగున నియమింప ప్రభుశాసనప్రకారంబు పనుల నొనర్చుచు నొక దినంబున వీరబాహుని పాదంబులు పట్టుచున్న సమయంబున వీరదాసా! నేనొర్చెడికార్యంబుల జాగ్రతగా జేయసమర్థుడవని తోచినది గాన నిదిగో ముద్రగుదియు యీనగరి వల్లకాటికిం జని యచ్చటి పనుల నొనర్చుమన భూపాలుండు వల్లెయని చని.

సీ. పాతిన పీన్గుల బైకీడ్చి భక్షించు నక్క దుమ్ముల గొందు లొక్క
చోట । ఎప్పుడో పోశిన బుగ్గి క్రొత్తచేటలు జాప లోటువోయినకుండ
లొక్కచోట । నారాయిద్రావి మాంసముమెక్కి యిట్టట్టు నూగు
చుండెడి క్షుద్రు లొక్కచోట । భూజమ్ము లెక్కి నిప్పుల రాల్చి
యోహూహూ హూ యను దయ్యమ్ము లొక్కచోట ।

గీ. ఒత్తిపల్కు మాంత్రకవిప్రు లొక్కచోట
ఓ మటిని మొక్కు పెనుకాకు లొక్కచోట
ఒలిగాగాలు పీనుంగు లొక్కచోట
అట్టి వల్లకాడు త్రిశంకుపట్టి చూచి.

వ. ఇట్టి ప్రేతనికేతంబునకు నేలికయై యుండగలసివచ్చెనని లోజింతించి యచటి పనులు నెరవేర్చుచుండ గాలకౌశికుండు లోహితాస్యుని దిలకించి.

సావేరి—ఆదితాళము.

విను మోగి బాలకా! వీను లొగ్గి శ్రద్ధతో॥ విను॥
తినుబడివస్తువుల బొట్టనిండగదిసి తిరుగుచుంటివిగద వృథా॥ వి॥

అటవిసీమలకు నేటినుంచి యీ వటువులతో జనుదెంచి ఫలపత్ర
పుటముల గొనితెమ్ము లేనిచో నిన్నటమటగావింతు బాలాజీసాక్షిగ॥

వ. కాలకౌశికుం డీరీతినిబలుక లోహితుండు గనుదమ్ముల నశ్రుబిందువులు జలజల రాల్చుచు దల్లితో దెలుప గుమారుని చుంచుదువ్వి.

కాఫీ—ఆదితాళము.

తనయా! తనయా! నిన్నెటు బనిచెదర సవినయా॥ తన॥
కనికరముమాని బ్రాహ్మణుండు నిను గానసభూమికి బంపదలచెనా?
అనయ్యమునిరి తోడులదూగుచుండు యతివలకు బుట్టక విపత్తుల
మునుగుచున్న నాకడుపునజనించి పెనుబాము లనుభవింపవలసెనా?
కారు కానలకు బొమ్మనుటకు నానోరెట్టు లాడురా
పారుసి శాసనంబు మీరిన భూపద్రోహమబ్బురా కాన
మారుబల్కరాదు చేయుట మంచి నీదునాదు
పూర్వపుణ్యమెట్టులున్నదో యాతీరున బాలాజిదయ రాకపోదు॥

వ. ఇట్లు చింతించి సకలదేవతాప్రార్థనంబు గావించి కుమారుని దీవించి పంప లోహితుండు తోడిబాలురంగూడి యడవికేగి సమీపమందున్న మట్టిచెట్టుక్రిందం గల పుట్టపై నొకపాదము రెండవపాదము మ్రానిపైనుంచి యందెడి యాకులంగోయ.

క. ఆతఱి నహిరాజంబల
భూతలపతిసుతుని పాదమున గఱువగ లా
లాతతి నోటను గార్చుచు
హాతల్లీ! యనుచు నొరిగె నవనిస్థలిపై.

వ. పిమ్మట తోడిబాలురంగాంచి నెచ్చెలులారా?

సీ. తడవయ్యెనని యుపాధ్యాయుండు గోపించి దండింపబూను సత్వర
జనుండు। గురునకు ఫలసమిత్కుశ పుష్పపత్ర సంతతిని సద్భక్తి
నంపితి ననుండు। లోకమే నేనని లోనెంచు తల్లి బాకీనాకు దీర్పనే
గితి ననుండు। గురునాజ్ఞ వేగగైకొని నొక్కసారి మాయమ్మను
ననుజూచి పొమ్మనుండు।
గీ. నాకునై నిరీక్షింపుచు వ్యాకులమ్ము
నొందు తలినంపు డొడలంతయు గరళమ్ము

చెదరి తలకెక్క నిల్వాదిజీవనమ్ము
నగవకుండిది కడపటి వందనమ్ము.

వ. ఇట్లు బలుక తోడిబాలు రాతనివిలోకించి యాహా యేమిచిత్రము కొండల నైన నీరుజేయంగల విషాగ్ని మట్టిచెట్టున భస్మము గావించెగాని యీ చిన్నవాని నేమి చేయంచాలదయ్యె. శరీరమా గాజువారలేదు. చేతులం గల రక్తిమమా తగ్గలేదు. విషము మ్రింగి మూర్ఛిల్లిన నీలకంఠునిపోల్కి మూర్ఛిల్లె. నాసాధ్వీమణి యాశీర్వచన మెట్టిదిరా యని విస్మయమంది లేనిదుఃఖము దెచ్చుకొని చంద్రమతి నవలోకించి యమ్మా! పాము వలన నీకుమారునకు మరణము సంభవించినది యని బలుక తద్వార్త కర్ణపుటంబున సోకినంత నొక్కవ్రేటున కూరగిన యరటిచెట్టుమాడ్కి నేలనొరగి కొండొకసేపునకుం దెలివి తెచ్చుకొని.

నవరోజు—ఆదితాళము.

1 ఎట్టివార్త వింటిరా కొడుకా! యెట్టి॥
2 నట్టనడవిలోనమట్టి । చెట్టుక్రిందనిన్ను బాము
గుట్టినంతనీమనసప్పు । డెట్టులున్నదో కొడుకా! ॥యె॥
3 నాయుల్లము రంజిల్లయ । మ్మాయనిబిలిచియన్న
మీయమని కొంగుబట్టి । యీడ్చువారెవ్వరోకొడుకా! ॥యె॥
4 చిట్టినాన్న ముద్దియరాయన । చెచ్చెరవచ్చిముద్దిచ్చి
కట్టునవాచెక్కిలిముద్దు । బెట్టినవ్వువారెవరోకొడుకా! ॥యె॥
6 ఖలుదైవము నన్నాప । దలముంచెనని పలుమారు
బలవింపనాతోగూడ విలపించువారెవరోకొడుకా! ॥యె॥
5 పరిపాలితబాలాళి । కరుణాసిగతిమనపై
నెరపినందున నట్టి । నివ్వాలప్పనవికొడుకా! ॥యె॥

వ. ఈగతి నేడ్చుచులేచి యేలికసాని నవలోకించి యమ్మా! నా కుమారునకు పామువలన నడవిలో చావు తటస్థించెనట. కరుణించి సెలవిమ్మన నా కలహాకంటకి యేమేమీ పాముకలన నీబిడ్డం డీల్గెనా? మాకు సంతసమే. యేలయన యింటంగలవస్తువులం దిని క్రొవ్వుబట్టి మట్టిక్రిందకుం బోవనేల? తోడిబాలుర వెంటనంటి వెళ్ళిన వీనికేల మరణము తటస్థించును? అని పలుక నమ్మా యట్లనవలదు. కరుణించి సెలవొసంగుమన మంచిది యింటగల పనులందీర్చి యవకాశమున్న నేగవచ్చునన పగలంతయు గల పనుల నెరవేర్చి కలహాకంటకి పాదంబులంబట్ట యామె నిద్రం జొక్కినపిదప బైలువెడలి పతిభక్తియే నూతగా జేసికొని మధ్యరాత్రియం దడవిజొచ్చి పుత్రునకై వెతకి యొకచోట నేలంబడియున్న వానింగని లేపి లేవకున్నంత వక్షస్థానంబున గరతాడనంబొనర్చుచు.

ముఖారి—ఆది తాళము.

లేవవేమిరా తనయా ! ॥లేవ॥
యేవిధముననిందు । జీవించియుందుముందు॥ లేవ॥
చెల్లబోనేడునీతండ్రి । యుల్లమేరీతిదల్ల
డిల్లుచున్నదో దెలియ । దల్లననాముద్దుకొడుకా ! లేవ॥
అలనాడునీచేతినీ । శ్యాధారమనియుంటి
గలనైననిట్టిపని । కాదనుకుంటి కొడుకా॥ లేవ॥
కన్నతండ్రీ ! పాలితబాలాజీ । కెవ్వ దెగ్గుజేసితివో యా
పన్నగమును నీకొఱకై గల్పనజేసెనన్నా ! రాజే
మిన్నా ! నన్ను గన్నతండ్రి । కన్నబలుకకున్న బ్రతుకుటసున్న॥ లే॥

వ. ఇట్లేడ్చుచు నుచిత సంస్కారము చేయుందలంచి మూపున బిడ్డ నెత్తుకొని వచ్చుచుండ రుద్రభూమిం గల హరిశ్చంద్రుండు మానసమ్మున.

సీ. తపసికి నేలద త్తము జేయు కొక్కటి యత డప్పు మఖల నిమ్మనుట
రెండు । నక్షత్రకుడు నన్ను నలయించుటలు మూడు కోమలి నిడి
సొమ్ముగొనుట నాల్గు । ముద్దుబిడ్డను దూరమున నుండుటలు నైదు
మాలకు బంటునై మనుట లారు । కావలినై వల్లకాటినుండుట
లేడు నిట రాత్రులుబరుంట లేడునొకటి ।
గీ. అయ్యయో యష్టకష్టమ్ము లనుభవించు
చుంటి నికపైపజాల ముక్కంటివేల్ప
చిన్నిబిడ్డను బ్రియురాల నన్నుగల్ప
నేలయోచింపకుంటివి తోలుదాల్ప.

వ. ఇట్లు చింతింప చంద్రమతి ప్రేతభూమిని బ్రవేశించి యెండుకట్టెలం జేర్చి చితిపేర్చి దానిమీద గుమారునిడి.

సీ. నెలలుతొమ్మిదిమోసి నిన్ను గంటినిగాని యెన్నడైనను బాల నిచ్చి
యెఱుగ । నొకళ్లు నీకు నన్నము బెట్టుటయెగాని పిలిచి నీకెప్పుడు ది
న్పించియెఱుగ । అల దాదులెత్తి ని న్నాడించుటయెగాని తనయు
డా ! నిన్నెత్తికొనుటయెఱుగ । దూరాననుండి ముద్దులునెట్టుటయె
గాని సేవలు నీకెప్డు జేసియెఱుగ ।

సీ. నాయనా! నాహృదయమ్ము రాయి జేసి
ప్రేతభూమికి నీకు నాచేతిమీద
నక్కటా యగ్నిసంస్కార మాచరింప
వలసివచ్చెను నేడు ముద్దులకుమార.

వ. అని మఱియు.

ఉ. ఓరికుమార నిన్నుసిరియుయ్యాలతొట్టిని బెట్టి దాదులిం
పారగ సౌధమధ్యమున బాటలఁబాడి యూపగా
గూరుకుజెందునీవిపుడు ఘోరమృగావళులున్న చోటికిన్
జేరగవచ్చి పెంజిలువచే గతజీవుడవైతి వింక యే
తీరుననుందు నిన్విడిచి తీరనిదుఃఖముగా పెట్టిపోతివా.

వ. ఇట్లు చింతించి యగ్నిసంస్కారము సేయందలంచి ప్రవత్నిణ మొనర్చి చేతు లాడక.

హిం॥ భయిరవి—రూపకము.

నీకునాకుగలఋణమ్ము। నేటితోదీరెనాకొడుకా! ॥నీకు॥
భీకరాహిబుసకొట్టుచు। నీకాళ్లఋవంగనపుడు
నాకొడుకాయెంతతల్లడిల్లినావోయిటురావో॥ నీకు॥
మగనిబాసినిన్నుజూచి। మదిలోపలబాధుకొన్న
దిగులుమానిధైర్యమ్మున। దిరుగుచుంటికొడుకా!
పగవహించిబాలాజీ। వరదుండునాకు తురక
తెగనికత్తితోడగోసె। తగుదయనాపైనిడక
సుగుణగణా! నాకుంగల। నగపుమాన్పవారేరీ
జగతినినాకేమియుదో। చను చూపుమేదియొదారి॥ నీ॥

వ. ఇత్తెరంగున బలవింపుచుండ హరిశ్చంద్రుం డాలకించి వచ్చి నీవెవడు రేయి నిచ్చటి కేలవచ్చితివి. మరణ మొందినవాడు నీకేమికావలయు. నేకారణమున నీశం డంత మొందెనో చెప్పుమన నావెలంది.

ఆనందభయిరవి—చతురశ్రగతి.

ఓపావనచరిత్రా! యఘులతాలవిత్రా! ॥యో॥
బాపనయ్యయింటగల్గినట్టి। పనులొనర్చి కాలముగడుపుచుంటినో॥

నన్ను హంసనారియనుచు బిలుతురు । నాయేలిక ఫలములు దెమ్మనగా
గ్రన్నన నాకొమరుండడవికిజని । కొన్నిపండ్లు గోయుచుండ నత్తరి
పన్నగంబు వీనిని గఱువ గతప్రాణుడయ్యె నల్పజీవి దల్ప వీని గాల్ప
సెలవొసంగు॥ మో॥

వ. ఇట్లు విన్నవింప నాతం డాలోకించి నాయాజ్ఞ లేనిది ప్రేతభూమికి వచ్చినందుకు నాడుదానవగుట మన్నించితి నిదియే మగవాడయినచో నీకరవాలమ్మున వానితల తునియలు సేయక మాన. నాపేరు వీరదాసుండు వీరబాహుడగు నాయజమానుని శాసనం బవలంబించి యిచ్చటనుంటి. సాద పేర్చినందుల కొకమాడ సమర్పింపవలయును నీవంగీకరించితివేని మాడయిచ్చి చిన్నవానికి నగ్నిసంస్కారము నొనర్పుము. లేదా! వచ్చినమార్గము పట్టుమన మహాత్మా!

తే. ఇసుసులనేకము బడుచుంటిని నాకీగతి వ్రాసెను ధాత
కడుబీదరాల నెట్లీయగల కాసైన లేదు చేత
కరుణింపుము చెదరిపడియున్న యీకట్టెలెల్ల బేర్చుటకు
వెరపుమాన్పి సెలవొసంగుమిపుడీ పీనుంగును గాల్చుటకు.

వ. ఇట్లు ప్రార్థింప చిన్నదానా! మాప్రభువుశాసనప్రకారము చేయక వీలుపడదని నొక్కివక్కాణించినను కొంచమయిన నాలోచింపకుంటివి. విధాయకముగా మాకు మాడ సమర్పింపక తప్పదన నతనిజూచి కన్నీరునించుచు.

సీ. సకలభూపాలక మకుటోరునవరత్న కాంతిశుంభత్పాదకమలు డెవడు । గాధేయుకరుణ స్వర్గముగొన్న యల త్రిశంకుని కూర్మిపెంపుడు కొమరుడెవడు । పిల్లలగా సాకు తల్లిదండ్రులరీతి ప్రజల హర్షమున గాపాడెనెవడు । అనృతమాడగలేక నప్పుదీర్చుటకునై యాలినంగడిబెట్టి యమ్మెనెవడు ।
గీ. విష్ణుచంద్రుల కావిర్భవించెనెవడు
అట్టి వరహరిశ్చంద్రుని యనుగుపట్టి
కఠినమైనట్టి యీవల్లకాటిలోన
తగలబెట్టుటకైనను తగదటయ్యా?.

వ. ఇట్లన వీరదాసుండు యేమేమీ చక్రవర్తిభార్యవంటివి యొక కాసైనను లేకపోయినదో! యన చంద్రమతి మహాత్మా! యున్నయెడ యీబాధ యెందుకు నా

యం దనుగ్రహింపు మన, చిన్నదానా! కరుణింపుము కరుణింపుమని పలుచూను వల్కు-చుంటివి.

ఉ. పంచశరారిపూజ నెడబాసి యశోధనమెల్ల నబ్ధిలో
ముంచి కులాభిమాన మొకమూలను జేర్చి యదృష్టహీనతన్
బంచమవంశజాతునకు సౌకరునై యిటు రుద్రభూమి కే
తెంచిన క్రూరచిత్తుడు సతీ! దయజూపగలండె చెప్పుమా?.

వ. పోనిమ్ము కాసైన లేదంటివి. నేజెప్పినచొప్పున జేయుము.

శ్లో. జలజపత్రనేత్రా! మాకీయగవలసిన మాడకుబదులు
గళమునగల శతమానమిచ్చి సంస్కారంబొనరిచి కదులు.

రి. ఇట్లన శతమానమిమ్మని యడుగుచున్నాడు నామంగళసూత్రము నాపెనిమిటికి దప్ప పెరవారికి గానరాదుగనుక నీతండు నాపతియే సందేహము లేదని హరిశ్చంద్రు నవలోకించి.

క. జనవర మును మీంగొడమీ
దను నిద్దురబోయినట్లు ధరణీస్థలిపై
తనయుడువడి పెనునిద్దుర
గొనియున్నాడిదిగో చూడు కుమతవిదారీ.

వ. ఇట్లు చంద్రమతిపలుక హరిశ్చంద్రుండు దుఃఖమాపలేక.

హిం॥ భయిరవి—ఆది.

నను జూడు కన్ను దెఱచి నాముద్దులకుమారా? ॥నను॥
పనిమీద నేయిటజేని మరలవచ్చుచున్న
నను జూచి బాబావచ్చినాడని యెదురువచ్చువారెవరో
నీకరములమీద పుణ్యాలోకమున కంపెదనని మా
రాకారనమ్మియుండ బాలాజీవరదుని సత్కృప
లేకయేకదా? నిన్ను నాకరముల మీదబుణ్యా
లోకమునకంపవలసివచ్చెను నాకుమార! సుకుమార॥ నను॥

వ. ఇట్లు బలవించు నరవిభు నాసతీమతల్లి చూచి జీవితేశా!

క. మనమీగతి దుఃఖాబ్ధిని
మునిగిన లాభమ్ము లేదు మున్మహనులు మో

చనజేయుడీ నుడుదోపక
మునుపే యేలిక సికార్యంబున కేగవలెన్.

వ. ఇట్లన హరిశ్చంద్రుండు యువతీలలామా! యిచ్చట నెవ్వరుండిరి చేయవలసిన కార్యము గావింప బాగనుండునని నీతలంపు దేవునకు దాచగలమా! గావున.

తో. తడయకజని నీయేలికబాపని నడిగిమాడమాకిమ్ము
బుడుతనుతదుపరిగాల్పవచ్చునో పూర్ణేందువదన! లెమ్ము.

వ. ఇట్లన జంద్రమతి ప్రాణేశా! చిన్నవానిని జాగ్రతగా చూడుము చనివచ్చెద నని పారునింటికి బోవుచున్నతరి గాఢయుచే నంపబడిన దొంగయొకడు కాశీరాజ పుత్రుని జంపి యానగలన్నియు దెచ్చి చంద్రమతికిచ్చి పిమ్మట రాజభటులతో కలిసివచ్చి వారల కీవనజాక్షి నప్పగించ తద్భటు లీమెను కాశీరాజుముందర నిలుపగా దీనిముఖము చూడకూడను. వీరబాహునియొద్దకు దోకొనిపోయి తలతఱగవలసినదని యాజ్ఞ నేనిచ్చితి జనుడని రాజువల్కి నంత నామెను వీరబాహునియెదుట నిలుప నాతండు నా నౌకరు వీరదాసుండు వల్లకాటిలో కావలియున్నాడు వానియొద్దకు పొండన మంచిదియని చంద్రమతిని రుద్రభూమికి గొనితెచ్చి హరిశ్చంద్రునియెదుటనిలుప నాతండు విస్మయమంది యేమిచిత్రము రణభూమిని నోట గడ్డిగఱచివచ్చువారల, నిరాయుధుల, శరణము గోరు వారల రక్షించు నేను నిష్కారణ మీయాడుదాని జంపవలసివచ్చినది చంపితినా స్త్రీహత్య వచ్చును మానితినా రాజద్రోహ మబ్బునని డోలాయమానమానసుండై చింతించు సమయంబున నా సాధ్వీలలామ పక్కన నవ్వి భర్తను నవలోకించి.

సావేరి — ఆదితాళము.

అనుమానింపగనేలా యవనీపరిపాల॥ యను॥
వినుమీయేలిక చెప్పినగతిగా వింపబూనుకొమ్ము లేలెమ్ము॥ అను॥
రాచపట్టినిజంపినగలెల్ల దోచుకొంటినను దుర్మార్గులు
సిచాపనిందనాపైనొక్కటి సల్పినారుగాన వేరేయా
లోచింపగనేలా? బాలాజగోపమొన్న నిఫాలాతుడేగతి
సిచే కట్టుచేసను ద్రుంపువిరోచనాన్వయాబ్ధిచంద్ర! నరేంద్రా! ॥అ॥

వ. ఇట్లావెలంది వలుక నరేంద్రుఁడామె ధైర్యమ్మున కచ్చెరువొంది మంచిది యని నరుకబోవ నాసమయమ్మున విశ్వామిత్రుం డరుదెంచి కరవాలమ్ము బట్టుకొని భూపాలునిజూచి.

కమాచి — ఆదితాళము.

ఓరాజా! తగునాసతిని జంపబూనుట॥ లో॥
నీరదనిభశ్యామగజరజనీచరసూదనపదానురాగి॥ యో॥

రక్కసుడవుగాక ఆహా రాజువె? మతిలేక వసిష్ఠుడు
చక్కెరబోడుల జంపమను చేదువు మక్కువతో జెప్పెన
మనమె చెప్పెన ॥ యో రా ॥
అరిభూపాల సమాజోన్నతమద మణాపగలశక్తిగల నీ
కరవాలమున కులాంగనకుత్తుక ఖండింపగ నాసక్తిధరణీ
వర! దృఢముగబుట్టెన పిచ్చి పట్టెన నీనీతిగట్టెన ॥ యో ॥
అమలంబయినట్టి సూర్యకులమున బుట్టి నీ
యనుంగుపడతిని సమయింపగ సమకట్టితివా? నీనే
మమునుదిగనాడి నాకూతుల హస్తములు వట్టినట్లయిన నీకూర్మి
కొమరుడుజీవించు మరి నీకోమలియు లభించు నీరా
జ్యము క్రమ్మఱవచ్చు బీబాలాజీవరదుడుమెచ్చు ॥ నోరాజా ॥

వ. ఇట్లు విశ్వామిత్రుండన హరిశ్చంద్రుండు మునికులోత్తమా!

తోడి—ఆదితాళము.

వినుమయ్య నామనవి వీనుంగవనొడ్డి ॥ విను ॥
మునుమీరు నాతో జెప్పిన బుద్ధులుగానె క్రొత్తలుగలనె ॥ విను ॥
పరులగతిని నన్నెంచ నాకరవాలమ్ము విడిచి యింటికి సత్వర
నరుగుమింక బీబాలాజీదాసావనుండు మిమ్ముగాపాడునేడు ॥విను॥

వ. ఇట్లన విశ్వామిత్రుండు సిగ్గునజనియె పిమ్మట హరిశ్చంద్రుండు రెండవపర్యాయము నరికిన నాకరవాలమ్ము పూవుదండ తెరంగునజుట్టుకొనిన నేల మగండాశ్చర్యమంది మూడవపర్యాయము పరిశోధించెదనని నాభార్య పతివ్రతయయ్యెనేని యిప్పుడీ కుత్తుక తెగునుగాక యని కత్తియెత్తిన నంత జంద్రమతి సూర్యునిపై జూడ్కి నిల్పి హస్తములు జోడించి.

సీ. నన్ను బుట్టించితే నరజన్మమె నాకు గరుణింపుమయ్య యో కర్మసాక్షి
అందు సద్గుణవంతురాలుగా చక్కని కాంతగానుంపుమో కర్మసాక్షి
సత్యాత్ముడగు హరిశ్చంద్రుని నాభర్తగా జేయుమయ్య యోక
ర్మసాక్షి । ఆజ్ఞదప్పని లోహితాస్యుని సూనుండుగానుంపు మ
య్య యోకర్మసాక్షి । పేదసాదుల బ్రీతి నాదరించుటకునై కనకం
బొసంగుమో కర్మసాక్షి । సంగీత సకలభాషాసాహితీపరిజ్ఞానం బొ

సంగుమో కర్మసాక్షి । ఆర్యానుకూల వేదాంతవిద్యాసక్తి గరు
ణింపుమయ్య యోకర్మసాక్షి । అంత్యకాలమువచ్చి నప్డు ముత్తైదు
వగాదర్ల జేయుమో కర్మసాక్షి॥

గీ. నిర్మలకరప్రదీపయో కర్మసాక్షి
గ్రహపతీ! లోకబాంధవా! కర్మసాక్షి
కమలచక్రసమూహాప్త కర్మసాక్షి
కంజజాభవ హరిరూప కర్మసాక్షి ॥

వ. అని యిత్తెరంగున బ్రార్థించుచున్న సమయమ్మున.

హిం॥ భయిరవి — ఖండగతి.

అంతనాగీర్వాణులంతరిక్షమ్మున నెంతయో చింతగొని వింతగను
చుండన్ । జెంతగలభూతములు గొంతుకలబంటి నల్లంత గొనగూకలిడి
గంతులిడుచుండన్.

మిశ్రగతి.

తలమీదనల నెలవంకతో నొకకేల ముద్దులజింకతో
జడలందుగల మిన్నేటితో కొనవంగు చిటికెనగోటితో
గననింపుగల మించడలతో విభూతిబూసిన యొడలతో
వెనుసంటు యేనుగుతోలుతో నొకకేలము మ్మొనవాలుతో
మెడనున్న పునుకల దండతో నొకచేత బంగరుకొండతో
కనునల్లకు త్తుకసొంపుతో నెమ్మైన పాములగుంపుతో
తొడమీద విద్దెల ప్రోడతో మునుమున్ను తెల్లనిదూడతో
దయిగల్గు చల్లని చూపుతో వెనుమంచుగుబ్బలి పాపతో
మహనటుండరుదెంచె నామానవతిని గావన్ ॥

వ. అంత నాయాలి మగాలాదేవుని విలోకించి.

ఆనందభైరవి—త్రిశ్రగతి.

పరమేశ్వర నీస్వరూ । పముగని ధన్యులమైతిమి
కటువుదీరె నింకదయా । కర గజదానవహారా? ॥ ప ॥
దేవతలయినను నీమాయ । దెలియలేరు మృగధరా

మాపవశమా గనుంగొనను । మామనోజ్జబ్బంభిరా ॥ ప ॥
పాలిత బాలాజీదాస । భక్తజనాధినిరాస
పాలాక్షా! వ్యోమకేశ! । పాపతిమిరదినేశా! ॥ ప ॥

వ. ఇట్లు నుతిజేయ మహాదేవుండా హరిశ్చంద్రుని మేను నిమిరి రాజా? నీసత్యమ్మునకు మిగుల సంతసించినాడ నీకీకష్టములు ముట్టడించెనని వగవకుమని బుజ్జగించి.

సావేరి — ఆదితాళము.

రాజా! దీనమానవకల్పభూజరూప వినిర్జి తరతి ॥ రాజ ॥
రాజరాజశేఖర బీబాలాజీవరద పాదానుమోద ॥ రాజ ॥
నడుమున జర్మమునేసి పె । న్నొడల విభూతినిబూసి
బడుగుదయ్యములు గొలునగ యీ । వల్లకాటికిం బ్రభుడవైతివో
పుడమిఁతేడ నాతో సమానుండవీవు సి
నడత లితరభూపతులకు నరయగ లేవు సుగుణములకు స్థానమీవు ॥
చూడు, నీభార్యనేలిన । వాడు, కలిరాజు బాపండు
గాడు, నీయొడయడగుమాల । వాడు, సమవర్తియిదివల్ల
కాడుగాడు జన్నములొనరించెడి । పాడుసందియంబేల గనుగొనుము
నేడుభూమిలో నీకుసామానుడు । లేడు మదినిగలగోడుదిగనాడు॥ రాజ

వ. ఇత్తెరంగున బల్కి హరిశ్చంద్రుని కన్నుగవందుడువ నాకండంతయుజూచి విస్మయమంది.

క. జలజారివమాళి! నీమహి
మలు బలరిపు పద్మభవ రమాపతులైనన్
దెలియగ లేరను నాడుక
కలదిక మాబోంట్ల కెల్ల గనుగొనవశమే.

వ. అంత చంద్రమతిని పార్వతీదేవి గాంచి యమ్మా నీపతివ్రతాధర్మమున కెంత యో యానందించితి నీయభీష్టం బెటింగింపుమన నా చంద్రమతి అమ్మా కాత్యాయనీ! కాశీరాజ సూనుని జంపినానను నింద నొందియుంటి నాచిన్నవానిని సజీవునిగాజేసి నాకుంగల యపనిందబాపుమని ప్రార్థింప సాధ్వీలలామా! నీకీచింతయేల యిదివరకే బ్రతికించితి సందియమొందకుమను సమయమ్మున లోహితాస్యుండు లేచి నిలుపంబడ నాతుగుణవతి కడకేని యానందమున గౌగిట హత్తుకొని ముద్దిడుచున్నంత విశ్వామిత్రుండరుదెంచి యోహరిశ్చంద్రా! నీయెడల జాల నపరాధినైతి క్షమింపుము మఱల

నీరాజ్యమును గైకొనుమన రాజా తపోధనా! మీ కృపారసమువలన నాయశంబు లోకమున వ్యాపించుటచే నాకు మేలు గావించినవారలలోనొకనిగా నెంచితి రాజ్యము నాకవసరములేదు మీరే యనుభవింపుడు లేనిచో మీయిష్టమువచ్చినవారిచే బరిపాలింప జేయుడని బల్కు గాధేయుండు రాజా! నాకుయిష్టముగల రాజువు నీవే పాలించెదవా యనృతమాడెదవా? యని బల్కు సమయమ్మున వశిష్ఠుండరుదెంచి యోహరిశ్చంద్రా! నాశిష్యుండవైనందుకు నామర్యాద నిల్పితివి పాపమీతండు క్రమ్మఱ రాజ్యభారము వహింపుమని గోరుచున్నాడు గనుక నాపాటిమాటయైన జెల్లింపకున్న సరసముగా నుండదు గావున గౌశికుని గోరికదీర్పుమన హరిశ్చంద్రుండు వల్లెయని మఱల రాజ్యముం బాలింప నుద్యుక్తుండైనంత నచ్చట పట్టాభిషేకంబొనరించిరి పిమ్మట నారదుం డయోధ్యకరుదెంచి హరిశ్చంద్రుండు వచ్చుచున్నాడని సత్యకీర్తితో విన్నవింప నాసత్యకీర్తి యత్యంతానందమ్మున కౌశికునాజ్ఞచే పట్టణంబలంకరించి యెదురుగ వచ్చి హరిశ్చంద్రుని దోకొని చని పట్టాభిషేకంబొనరించిరి. తదనంతరము సతీసుత సమన్వితుండయి యను కాలమ్మున రాజ్యంబేలి యత్యంతమున సద్గతినొందె. నిట్టి హరిశ్చంద్ర చరిత్రమును విను వారనృతవాదులు గాకుండ నుండునటుల బ్రయత్నించి తత్ఫలమనుభవింతురుగాక.

త్రైశంకు విజయము, సమాప్తము

---

## సురట—ఆదితాళము.

మంగళం మహాదేవ మంగళం జయ ॥ మం ॥
అంగజగర్వ విభంగసాగర సిపంగ నగజాతముఖరాజీవ ప
తంగదళిత మాతంగదనుజధవళాంగ వృషతురంగ దయాంతరంగ ॥
బాల చంద్ర శేఖర రణభీకర । నీలకంఠ ఘోర దురితాభ్రవా
తూలకలధృతకపాల శూలకర । నాలవాల బాలాజీప్రపాల ॥మం॥

---

శ్రీ

# హరిశ్చంద్రుని జన్మవృత్తాంతము

వ. దక్షప్రజాపతి భార్యయగు సుకరిణియం దిరువదేడ్గురు కుమార్తెలు పుట్టిరి వారలకు క్రమమున అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి యను మొదలగు నామంబులుంచి గారాబమున బెంచి సకల విద్యాధికులంజేసి పెండ్లిజేయనూహించి చంద్రుండు దన బిడ్డలకు దగినవాడని నిశ్చయించినంత నాబాలంతులు తండ్రికిమ్రొక్కి నాన్నా! మా యక్క చెల్లెండ్రనందరిని చంద్రునకు గట్టిపెట్ట నూహించినట్లు వింటిమి అయితే నూలో రోహిణివిద్యయందు చక్కదనమున తెలివితేటలలో మాకన్న వేయిరెట్లెచ్చుగనుక నామె యందనురాగమున మమ్ముల ననాదరించుననుభీతి మాయుల్లముల నల్లుకొనియున్నదిగనుక నిట్టిసంగతిలో కొంచమాలోచించి పెండ్లిగావించుట మాయభిమతంబన నామాట తండ్రి విని చంద్రునిరావించి తనకుమార్తెల యుద్దేశమెఱింగించి యందరియందేక స్వభావముతో వర్తించునట్లు కరారుచేయించుకొని బిడ్డలను చంద్రునకిచ్చి పెండ్లిగావించె నంత నాయాత్రేయుండు భార్యల వెంటనిడికొని యిల్లుచేరి సుఖింపుచు రోహిణియందుగల ప్రేమాతిశయమున దక్కువారల ననాదరింప నాగరితలు తండ్రిమ్రోలకుజని భర్తవలన వారలకుంగలిగిన యవమానమును వెల్లడింపదక్షుండు గోపించి కళానిధి కళాహీనుండగు గాకయని శపియించె నాసంగతి రోహిణివిని దిగులున దండ్రిని దర్శించి నాన్నా! మీతో నాఅక్కచెల్లెండ్రు చెప్పినమాత్రంబున కోపించి నాభర్తను శపియించుట ధర్మము గాదు కరుణింపుమని పదములమీదబడ దక్షుండు గనికరహృదయుండై చంద్రునిరావించి నీవు నామాటమీరి నడిచినందున నీగతి శపియించితినని యడుగగా చందురుండు దక్షప్రజాపతినిజూచి మహాత్మా నావలన నీలోపము జరిగినమాట సత్యమిది మొదటి తప్పుగా నెంచి క్షమింపుడింతటినుంచి యందరి నేకరీతిగ జూడకున్న మీచిత్తాను సరణి జరుప వచ్చునన దక్షుండు కొన్నిదినములు సురూపముగానున్నను కొన్నిదినములు కురూపముగా నుందువు గాకయని చంద్రునకుంగల శాపము మరలించె. అంతచందురుండిందుముఖులతో బోవుచు గౌతమాశ్రమమునంగల యొక సరస్సునుజూచి అందు భార్యతోగూడ జలకమాడి నిజనివాసంబుజేరె. నంత గౌతముండాకొలను సమీపించి అందుగల జలంబు ఖిలంబగుట జూచి కోపంబున నింతటినుంచి యీసరస్సున నాడువారు మునింగిన మగవారును మగవారు మునింగిన నాడువారగుదురుగాకయని శపియించి చనిరి. నిట్లుండ నొకదినంబున మరల నాకొలనిలో స్నానమాడదలంచి చంద్రుండు భార్యలతోనరుదెంచి మొదట

తానుదిగ స్త్రీరూపుండయి కొంతవడిచింతించి విష్ణువును బ్రార్థింప నతండరుదెంచి స్త్రీరూపముతోనున్న చంద్రుని మోహించి వ్యవహరించినంత కుమరుండొదవె పిమ్మట శ్రీహరి గౌతమునివలన సరస్సునకుం గలిగిన శాపమునుజెప్పి నీవిప్పుడు స్త్రీరూపమున నుంటివి మరల నిందు దిగితివేని మగవాడగుటకు సందియములేదని చెప్పగా చంద్రుండు మరల నాసరస్సునదిగి యెప్పటివలె మగరూపమున వహించి కన్నకొమరు నచట విడిచి భార్యలతోగూడ నింటికిజనియె శ్రీహరియు వైకుంఠమలంకరించె నంత నాకోనేటి గట్టునబడియున్న చిన్నవాని రోదనము గౌతముండువిని వచ్చి బిడ్డనుజూచి మెచ్చి దివ్యదృష్టిచే బాలకుని జన్మస్థితి తెలిసికొని అహల్యను రావించి బాలకుని జన్మకథనం బెరిగించి హరిశ్చంద్రుడను పేరిడి పెంచుచున నాతపస్వి గారాబమున బుత్రకుని బెంచుచుండె నంత నొకదినంబున త్రిశంకుండు సంతానములేక పరితపించి గౌతమునితో తనకుంగల లోప మెరింగింప నతండీ చిన్నవానినొసంగి వృత్తాంతమంతయు వెల్లడింప త్రిశంకుండత్యంతానందంబున బాలకుని దోకొనిపోయి గారాబమునబెంచి తనరాజ్యమునకు ప్రభువుగా నియమించెను.

హరిశ్చంద్ర జన్మకథ ముగిసెను.

